శ్రీవాగీశ్వర్యైనమః

# శ్రీ హనుమాన్ చాలీసా

మూలము: శ్రీ తులసీదాస్

తెలుగు అనువాదము

వాచస్పతి డా॥ వానమామలై వరదాచార్యులు

వెల: అమూల్యము

అంకితము

మాన్యశ్రీ

నరాల వెంకయ్య శ్రేష్ఠిగారికి

సాదరముగా

అనేక శుభాకాంక్షలతో

# కృతజ్ఞతలు

రామభక్తు లెల్లరును హనుమంతునిగూడ భక్తితో గొల్చుట సహజము. రామాయణముతో పాటు హనుమాన్ చాలీసానుగూడ నిత్యపారాయణ మొనర్చుట మనకు తెలిసినదే.

అట్టి హనుమాన్ చాలీసా తులసీదాస కృత మూలము హిందీలో వెలయుట, ఆంధ్రులకు తెలియుటకై దాని నేను అదే ఛందస్సులో తెనుగు నొనర్చితిని. దీని ముద్రణకు సాయపడిన మహితాత్ముడు శ్రీ పబ్బ శంకరయ్యగారికి నా అనేక కృతజ్ఞతలు.

డా॥ వానమామలై వరదాచార్యులు

ఈ గ్రంథ ముద్రణకు కర్తలైన

పదాన్యులు శ్రీ పబ్బా శంకరయ్య శ్రేష్ఠిగారి

# ప్రశంసా పంచరత్నములు

శ్రీ వానమామలై వరదాచార్యులు

పబ్బావంశ సుధార్ణవప్రధిత
దివ్యన్మంజు మాణిక్యనీ
కిభ్వంగిన్నిజ షష్ఠిపూర్తి
క్రమమున్ హేమాక్షతాశీస్సులన్
సెబ్బాసంచునొసర్చె విప్రతతి
నీ క్షేమాయురైశ్వర్యముల్
ప్రబ్బుల్ప్రాకి ఫలించుకల్పలతవై
గ్రాలన్ బ్రకాశింపుమా।

నీసౌజన్యము నీదుశాంతతయు
నీ నిర్దోషకృన్మూర్తియున్
నీ సచ్చింతన నీదుస్నేహమతి
నీ సద్భక్తి నీ త్యాగమున్
నీ సద్వృత్తియు నిండుగుండె
మరియు న్నీయాత్మికౌన్నత్యమున్
నాస్వాంతమ్మును దొంగిలించిన
వియన్నా ! శంకరశ్రేష్ఠిరాట్ !

నిజజీవితక్షీర నీరధిన్మథియించి
ఘనసౌఖ్యసుధలను గాంచినావు
సకలసద్గుణమణి ప్రకరమ్మువెలబోసి
అలకీర్తిసతిని పెండ్లాడినావు

వరదానధారా ప్రవర్షమ్ముతో నర్థి
వాంఛితమ్ములను పండించినావు
పుస్తకవ్యాపార శస్త్రరంగస్థలిన్
తులలేనిలక్ష్మిని గెలిచినావు
సాటియెవ్వరునీకు వైశ్యకులరత్న !
నీకు నరువదియేడులు నిండెనేడు
పబ్బిశంకరశ్రేష్ఠి సౌభాగ్యవృష్టి !
హరుడు మృత్యుంజయుండు దీర్ఘాయువిడుత !

లలిమహాకవులతో నలఘుకావ్యములఁ
గృతిఁబొందినట్టి సత్కృతివినీవు
ఆసేతుసీతాద్రి నలరుపుణ్యక్షేత్రముల
జరించిన ధన్యమూర్తివీవు
సతతమ్ము నధ్యాత్మ సచ్చింతనమ్ముతో
ధ్యానముద్రం బూను మౌనివీవు

ఘనయజ్ఞవ్రతదాన కర్మమ్ములొనరించి
భోగివౌ ఘనరాజయోగివీవు
నీదుజన్మ సార్ధకమయి నెగడెధరణి
కొదువలేదింకనీకు నేవిధముగనిన
సదమలహృదబ్జ నింకొకషష్ఠిపూర్తి
జరుపుకొన నీవు వేడుదాహరునినేను।

అనఘ నీకార్యదక్షత యనుపమమ్ము
అటులె నీపరచింతనమ్ము ప్రతిమము
ఐహికాముష్మికమహాసుఖార్జనమ్ము
సేయగలిగిన కడుపుణ్యకాయమిద్ది.
జయజయ శంకరశ్రేష్ఠి।
జయజయ సద్భాగ్యవృష్టి జయసకలేష్టి
జయ నిరతదానముష్టి।
జయజయ కల్యాణసుగుణ సాగరసృష్టి।

---

# పఠనా క్రమము

హనుమాన్ చాలీసా పారాయణము సుందరకాండ పారాయణముతో సమానము.

శ్రీ ఆంజనేయుడు ఏకాదశ రుద్రావతారమూర్తి గావున ప్రతిదినము పదకొండు పర్యాయములు, మండలము (40) రోజులు పారాయణంచేసిన, సర్వకామ్యార్థములు సఫలీకృత మగును.

ఒకే ఆసనమున కూర్చుని 108 పర్యాయములు పఠించిన విశేష కార్యసిద్ధి యగును.

నిత్యము మూడువేళల ఒక పర్యాయమైనను పఠించిన వారి యోగక్షేమములు భక్తరక్షకుఁడగు హనుమంతుఁడే తాను స్వయముగ చూచుకొనును.

## వాచస్పతి డా॥ వానమామలై వరదాచార్యుల

## ముద్రిత గ్రంథములు

మణిమాల
ఆహ్వానము
జయధ్వజము
విప్రలబ్ధ
పోతన చరిత్రము (మహాకావ్యము)
సత్యనారాయణ (ఆంధ్ర వ్రతకల్పము)
భోగినీలాస్యవ్యాఖ్యానము
వైశాలిని (మహానాటకము)
గీత రామాయణము (ఆంధ్రానువాదము)
మన పండుగలు
కూలిపోయిన కొమ్మ
స్తోత్ర రత్నావళి

ప్రతులకు :

వానమామలై వరదాచార్యులు

పోస్టు : చేన్నూరు, (వయా) మంచిర్యాల, జిల్లా : ఆదిలాబాద్

ఓం శ్రీ వాగీశ్వర్యైనమః

# శ్రీ హనుమాన్ చాలీసా

## ప్రార్థన

అతులిత బలధామున్ హైమశైలాభగాత్రున్,
దితిజవన కృశానున్, దివ్య విజ్ఞాగ్రగణ్యున్,
ప్రథిత గుణనిధానున్, వానరానీకముఖ్యున్,
మతిఁదలచి భజింతున్, మారుతిన్ రామభక్తున్ ॥

స్వల్ప గోష్పదీకృత మహాజలధిగమను,
క్షుద్ర మశకీకృతా సురాస్తోక బలుని,
రామ ! గాథాస్రగంచిత రత్నమణిని,
అనిల సుత భక్తినెదనెంతు నంజలింతు ॥

ఎసగు రఘునాథు కీర్తనంబెందు నెందు,
అందు నందుసుకృత మస్తకాంజలియగు,
అశ్రు ధారాప్రపూర్ణ నేత్రాబ్జయుగళు,
మారుతిన్ రాక్షసాంతకున్ మదిభజింతు ॥

శ్రీ గురు చరణ సరోజ రజమ్మున
నిజహృదయాబ్దము నిర్మలమొనరిచి
ఫలచతుష్టయ ప్రదమగు శ్రీరఘు
రామ యశోవర్ణన మొనరింతును
బుద్ధిహీనతను బొందితి తనువని
పవన కుమారుని భావించెద మది
పావని బుద్ధిని బలవిద్యల నిడి
సకల కష్టతతి సదా హరించును ॥

ఓయి రామపూజారి పరోపకారి
జయ మహావీర వజ్రాంగ శక్తిసార
భవ్య సద్ధర్మచారి సద్బ్రహ్మచారి
అద్భుత జ్ఞానగుణగేయ ఆంజనేయ ॥

మహావీర వజ్రాంగబలీ,
మంగళమూర్తీ నమో। నమో। ॥

శంకర సూనా సంకట మోచన
కేసరి నందన కలిమల భంజన
రాఘవదూత జయ హనుమంత
అంజని నందన అసుర నికృంతన
జయ రణధీరా। జయ రణశూరా।
జయ బలభీమా। జయ బలధామా।

మంగళమూర్తీ నమో నమో,
మారుతకీర్తీ నమో నమో। ॥

1. జయ హనుమంత జ్ఞానగుణసాగర
జయ కపీశ త్రిజగత్ప్రకాశకర.

2. రామదూత అతులిత బలధామా।
అంజని పుత్ర పవనసుతనామా।

3. మహావీర విక్రమ వజ్రాంగా।
కుమతి నివారక సజ్జన సంగా।

4. కాంచన వర్ణ వికాస సువేషా।
కుండల కర్ణ వికుంచిత కేశా।

5. వజ్రధ్వజకర వరమౌంజీధర
ఉపవీతాంచిత విపుల భుజాంతర.

6. శంకర సుత కేసరీ సునందన
తేజః ప్రతాప త్రిజగద్వందన.

7. విద్యా గుణ భూషిత అతి చతురా ।
రామ కార్య నిర్వహణ సత్వరా ।

8. రామ కథారత రసిక శిరోమణి
హృద్గత సీతారామ చరణ ధని.

9. చూచితి సీతను సూక్ష్మరూపమున
వ్రేల్చితి లంకను వికటరూపమున.

10. అతి భీమాకృతి నసురుల ద్రుంచితి
రామచంద్రు కార్యము సాధించితి.

11. మనిచితి సంజీవిని గొనిలక్ష్మణు
రఘుపతి పొంగి యురమ్మున నిడుకొన.

12. నినుగని రాముడు ఘనముగ బొగడెను
భరతునివలె సోదరుడవు నీవను.

13. రఘుపతి వేనోళ్ళం బొగడుచు నిను
గాఢప్రేమల కౌగిలి నిడుకొను.

14. అజహర గురు సనకాది మునీశులు
శారద నారద సహిత ఫణీశులు.

15. కాల వరుణ యమకవి దిక్పాలురు
నీమహిమల వర్ణింపంగఁ జాలరు.

16. ఒగి సుగ్రీవున కుపకృతి సలిపితి
రాజ్య పదవి గన రాఘవు గలిపితి.

17. నీ మంత్రమును వినియె విభీషణుడు
ఇల యెరుగగ నయ్యెను లంకేశుడు.

18. సహస్ర యుగ యోజనగత భానుని
లీల గ్రహించితి బాలక ఫలమని.

19. ముఖమున రఘువరు ముద్రిక నిడుకొని
అబ్ధిని దాటితి వాశ్చర్యమె ముని.

20. అవనిని దుర్లభ మనదగు కార్యము
పవన తనయ కృప వడసిన సులభము.

21. రాము ద్వారపాలకుడవు నీవు
ఆన గొనకెవడు లోనకు బోవు?

22. శరణన నొదవును సకల సుఖమ్ములు
ఈవె రక్షకుడ వెచటి భయమ్ములు?

23. నీకే సహ్యాము నీదగు తేజము
వడి నీ హుంకృతి వడకును త్రిజగము.

24. దరి జేరవు భూత పిశాచాదులు
మహావీర నామము విన భీతిలు.

25. వివిధ రోగములు పీడలు సమయును
మదిని వీరహనుమంతు జపించిన.

26. కరణ త్రయముల కపీంద్రు దలచిన
హనుమడు సంకటహరణ మొనర్చును.

27. శ్రీరాముడు నృపశీర్షమకుట మిల
సవరించితివాస్వామి కార్యముల.

28. ఎవరి మనోరథ మెట్టిది యైనను
పావని జీవన ఫలమమిత మిడును.

29. ప్రసిద్ధిగాంచిన భవత్ప్రతాపము
నలుయుగములలో వెలిగెడి దీపము.

30. సాధు సత్పురుష సంరక్షణ క్రియ
దైత్య నికృంతన దాశరథీ ప్రియ.

31. అష్టసిద్ధి నవనిధి సంధాతా।
యని వరమొసగె నవనిజా। మాతా।

32. రామ రసాయన మున్నది నీకడ
స్వామీ। రఘుపతి సాదరదాసుడ.

33. నిను భజించ రామునకానందము
సమయ జేయు బహుజన్మల బంధము.

34. అతడెట బుట్టిన హరి భక్తుండగు
అంత్యకాలమున హరిపురి కరుగు.

35. ఇతర దేవతల మతి విడిచి నరుడు
హనుమ గొలువ సకలాభీష్టము లిడు.

36. ఎవడు స్మరించునో జవగల హనుమన్ను
సకల పీడలును సంకటములు చను.

37. జయ విజయీభవ స్వామి మారుతీ
కరుణగాంచవే గురుదేవ ప్రీతి.

38. శతవారమ్మీ స్తుతి పఠించి నను
భవ బంధము విడి పరమ సుఖముగను.

39. హనుమాన్ చాలీస నెవడు జదువునో
శివ, గౌరీసాక్షిగ సిద్ధింగను.

40. హరిదాసుడె తులసీ దాసెపుడును
ఆలయ మొనరుచు మతని హృదయమును.

వానమామలై వరదుడు దాసుడు
అనువదించె నిది యాంధ్రభాషలో

వరదుని నిరతము హరి పదాశ్రితుని
రక్షింపుము కర్తవ్యంబనుకొని

పవన తనయ సంకట హరణా।
మంగళ మూర్తి సురూపా।

సీతారామ శ్రీలక్ష్మణయుత
ఎదవసించు సురభూపా। ॥



# మంగళ హారతి

1. హారతిడరె శ్రీ హనుమకు మంగళ
హారతిడరె జయ హారతులు... ॥హా॥

అఘదైత్యుల సంహారమొనర్చెడి
రఘుపతి పాదార్చకునకు మంగళ... ॥హా॥

2. కులపర్వతముల చలింపజేసెడి
బలశాలికి హరి భక్తునకు
కలలో రోగపు గాలియు సోకని
వజ్రకాయునకు వాతాత్మజునకు... ॥హా॥

3. రామాజ్ఞంజని లంకను జొచ్చి
అవనిజ జాడల నారసి వచ్చి
సత్పురుషుల కిటు సాయమొనర్చెడి
అంజని పుత్రున కతి బలశాలికి... ॥హా॥

4. శతయోజనముల జలనిధిదాటి
కుమతి లంకిణిని గోటనీ్మటి
అలయక సొలయక నసురుల దు్రించి
అశోకవని గూల్చి లంక గాల్చెను... ॥హా॥

5. సంజీవిని ఓషధిగొని వచ్చి
క్షితి లక్ష్మణునకు జీవన మిచ్చి
రాఘవు మనమును రంజిలజేసి
చిరజీవిగ నాశీస్సులు వడసెను... ॥హా॥

6. రామలక్ష్మణుల రథమటు మోయుచు
వాలము రిపు శరవారణ సేయ
వామహస్తమున వైరుల దునుముచు
సాధుల కుడిహస్తమ్మున బ్రోచెను... ॥హా॥

7. కనకపాత్రమున కర్పూరము వెలిగించు
అంజనిమాతయొ హారతు లీయ
ఆరతిగని నరులమరులు మునులు
జయ హనుమానని చేయగ ధ్వనులు... ॥హా॥

8. హనుమంతుని యీ హారతి బాడిన
నరులెల్లరు నిహపర సుఖములగొన
వానమామలై వరదుని దాసుని
రక్షించెడి శ్రీరామభృత్యునకు... ॥హా॥

హారతిడరె శ్రీహనుమకు మంగళ
హారతిడరె జయ హారతులు.



హనుమ, అంజనిపుత్ర, అత్యంత బలవంత,
అమిత విక్రమ, పవనాత్మజాత,
రామేష్ట, ఫల్గుణరాట్సఖ, పింగాక్ష
జనకజాశోకనాశక, మహోగ్ర,
కంధిలంఘన, దశకంఠదర్పవినాశ,
పావన లక్ష్మణప్రాణదాత,
అనుచు శ్రీహనుమంత ఘనతర ద్వాదశ
నామముల్ నిత్యము, నరుడు తాను.

స్వాపకాలంబునన్, యాత్రజనెడి వేళ
పఠనమొనరించినన్ మృత్యు భయములేక
సర్వకార్యంబులందును జయము నొందు
ఆయురారోగ్య భాగ్యాలి నలరు సతము.

---

# శ్రీ దేవీపూజ
# చండీసప్తశతి
# శరన్నవరాత్రపూజాకల్పము

శ్రీ దేవీపూజా, చండీసప్తశతి, శరన్నవరాత్రి పూజా కల్పం, సప్తశతీమూల ఆంధ్రతాత్పర్యం, దకారాది దుర్గాసహస్రనామ, దుర్గాష్టోత్తరశతనామ, దుర్గా త్రిశతీనామ, హోమవిధాన, దుర్గాసుప్రభాత, మంగళాష్టకయుక్తముగా, శ్రీమహాదుర్గా, శ్రీమహాకాళీ, శ్రీమహాలక్ష్మి, శ్రీమహాసరస్వతీ, పంచరంగుల చిత్రములు, నాలుగు యంత్రములతో క్యాలికో బైండు చేయబడి, అమ్మవారి బహువర్ణ ముఖచిత్రముతో అలంకరింపబడినది.

సుమారు 296 పేజీలు.　　　　వెల రూ. 15-00

తపాలా ఖర్చులు అదనము.

శ్రీ రామా బుక్ డిపో,

సికింద్రాబాదు.　　　　హైద్రాబాదు.

# శ్రీపాండురంగభక్తవిజయము

భక్తపుండరీకుడు మొదలుకొని పురందర దాసువరకు గల దాదాపు 90 మంది మహాభక్తుల చరిత్రలను విపులముగా దెలుపు ఏకైక సంపూర్ణ పాండురంగ భక్తవిజయము, ఆయ్యాది మంగళశ్లోక, పాండురంగాష్టకములతోను, భక్తిభావ ప్రబోధితములగు అనేక చిత్రపటములతోను, ముచ్చటైన అచ్చుపనులతోను, భక్తజనుల నాకర్షించు పంచ రంగుల ముఖచిత్రముతోగూడ మాచే ముద్రింపబడి అమ్మకమునకు సిద్ధముగా నున్నది.

రాయల్ సైజు 900 పేజీలు. వెల రూ.33-00

తపాలాఖర్చులు అదనము.

# శ్రీమద్రామాయణము

(వచనము)

తృతీయముద్రణము.

రచన : శ్రీమాన్ దాశరథి రంగాచార్యులుగారు

ఈ తృతీయముద్రణమున దాశరథీ శతకమే కాక పెద్దలఅభిప్రాయముతో శ్రీప్రసన్నరాఘవ, శ్రీ రామతారక, శ్రీ రామరాఘవ, శ్రీ రామప్రభు, శ్రీ భద్రాద్రిరామ, శ్రీ ఒంటిమిట్ట రఘువీర, శ్రీ సీతాపతి, శ్రీ మహిజామనోహర, శ్రీ రామరామ అను 10 శతకములు చేర్చి మున్నుకన్న 100 పుటలు పెంచి 32 బొమ్మలతో, పంచరంగుల ముఖచిత్రముతో, రాయల్ సైజులో అతి సుందరముగా తయారుచేయబడినది

850 పుటలు. వెల రూ. 38–00

తపాలాఖర్చులు అదనము.

శ్రీ రామా బుక్ డిపో,

సికింద్రాబాదు. హైదరాబాదు.

# శ్రీదేవీస్తోత్రరత్నాకరము

అను బృహస్తోత్ర రత్నాకరము

దేవి సుప్రభాతము, లలితా, గాయత్రీ, లక్ష్మి, సరస్వతి, ఇంద్రాక్షీ, సంకటహరదేవి, శీతలాష్టకం, వారాహిని, భగవతీ, తారా, దుర్గా, చండికా, దేవి, గౌరి, గంగా, రేణుకా, భ్రమరాంబ, బాలాంబి, బాలా, త్రిపుర, భవాని, బగళాముఖి, గిరిజా, కుమారి, అంబా, మాతంగి, మీనాక్షి, భువనేశ్వరి, ధూమవతి, తులసి, శ్యామలా, రాజరాజేశ్వరి, అన్నపూర్ణ, ఆనందలహరి, మూకాంబా, మహిషాసురమర్దని, కాళీ, సీతా, పార్వతి, భద్రకాళీ షోడశీ మంగళాష్టకములు మొదలగు 194 స్తోత్రములు, 1086 పేజీలతో సర్వాంగ సుందరమైన పంచరంగుల ముఖచిత్రముతో వెల రూ. 27-00

తపాలా ఖర్చులు అదనము.

శ్రీ రామా బుక్ డిపో,

సికింద్రాబాదు. హైదరాబాదు.

# శ్రీ శివస్తోత్ర రత్నాకరము

## అను బృహత్స్తోత్ర రత్నాకరము

శంకరప్రియులకు శ్రీశివ, గణేశ, సుబ్రహ్మణ్య వీర భద్ర మొదలగు 146 కావలసిన స్తోత్రములు అన్నియు నొకచోచేర్చి ఇదివరకుండెడి బృహత్స్తోత్ర రత్నాకరము లందు కూడ లేని కొన్ని స్తోత్రములనుచేర్చి క్రౌను సైజులో దాదాపు 504 పుటలలో అచ్చువేయించి మన్నికగానుండు నట్లు క్యాలికో బైండుచేసి త్రివర్ణ చిత్రముగల జాకెట్టువేసి సర్వాంగ సుందరముగ నొనర్చితిమి.

వెల రూ. 15-00 మాత్రమే. తపాలా ఖర్చులు అదనము.

# శ్రీ హనుమాన్ చాలీసా,

మూలము : శ్రీ తులసీదాసు.

తాత్పర్యము, ప్రార్థన, మారుతి స్తోత్రము, హనుమంతుని గుణగానము, బజరంగ్ బాణ్ (హనుమదాస్త్రము), హనుమాన్ హారతి మరియు 15 పంచరంగుల బొమ్మలు, 48 పుటలతో వెల 50 పైసలు మాత్రమే.

## శ్రీ రామా బుక్ డిపో,

సికింద్రాబాదు. హైద్రాబాదు.




నూతన తృతీయ ముద్రణము.

మహాన్యాస, రుద్ర, నమక, చమక, పంచసూక్త మన్యుసూక్త, సహస్రనామ, దశసహస్రనామ. అష్టోత్తర, త్రిశత్యష్టోత్తర. శతనామావళి, మంత్రపుష్ప, దశశాంతి విధాన, సంపూర్ణమంత్రముల స్వరయుక్తముగా, శివ పంచాక్షర, శివతాండవ, ద్వాదశజ్యోతిర్లింగ, పార్థివలింగ, శివాపరాధ క్షమాపణ, లింగాష్టక, సువర్ణధారాస్తోత్ర, మంగళాష్టక యుక్తముగా, త్రివర్ణ ముఖచిత్రము, మహాలింగార్చన పటము, సహస్రలింగార్చన పటముతో సుమారు 800 పుటలు. వెల రూ. 18-00.

(పోష్టు ఖర్చులు అదనము.)

శ్రీ రామా బుక్ డిపో,

సికింద్రాబాదు, హైదరాబాదు.